# బంజారా గీతామృత్

రచన

**కృష్ణనాయక్ చవాణ్**



**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2014**

# BANJARA GEETHAMRUTH

*Writer*
**Krishna Nayak Chawan**

*Editor-in-Chief*
**Prof. Ravva Sri Hari**

T.T.D. Religious Publications Series No.1083


*First Edition : 2014*

Copies : 1000

Price :

*Published by*
**M.G. GOPAL,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

***D.T.P:***
Office of the Editor-in-Chief
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507

# ముందుమాట

**"యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"**

లోకంలో ఉన్న ప్రతి విషయమూ ఇందులో ఉన్నది. ఇందులో లేనిది లోకంలోనే లేదని శ్రీమన్ మహాభారతం ఖ్యాతిగాంచింది. జయేతిహాసంగా ఖ్యాతిగాంచిన 18 పర్వాల మహాభారతేతిహాసంలో 18 అధ్యాయాల భగవద్గీత హృదయసమానమైనదిగా, మణిహారసదృశమైనదిగా భాసిల్లుతున్నది.

ఐహిక, సాంసారిక బంధాలలో చిక్కుకొని కురుక్షేత్రసంగ్రామంలో బంధుమిత్రులతో యుద్ధం చేయలేనని కర్తవ్యదూరుడైన అర్జునుణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేస్తూ శ్రీకృష్ణపరమాత్ముడు చేసిన ఉపదేశమే భగవద్గీత. నిజానికి శ్రీకృష్ణపరమాత్ముడు అర్జునుని ఒక సాకుగా చూపి సమస్త లోకానికి భగవద్గీతరూపంలో ధర్మాన్ని ఉపదేశించాడు. భగవద్గీతలోని కృష్ణార్జున సంవాదం మానవునిలోని అజ్ఞానాంధకారాన్ని తొలగించి జ్ఞానజ్యోతిని వెలిగించి మోక్షాన్ని ప్రసాదిస్తూంది.

హైందవ ధర్మప్రచారానికి గ్రంథ ప్రచురణలను ఒక సాధనంగా ఎంచుకొన్న తిరుమల తిరుపతి దేవస్థానములు ఇప్పటివరకు సంస్కృతం, తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, ఇంగ్లీషు భాషలలో శ్రీమద్ భగవద్గీతను ప్రచురించింది. అయితే ఇప్పుడిప్పుడే కొంత విద్యాభ్యాసం చేస్తున్న అల్పసంఖ్యాకులైన బంజారా ప్రజలకుకూడా గీతామృతాన్ని ఆస్వాదింపజేయాలనే సత్సంకల్పంతో ఈ 'బంజారా గీతామృత్' అన్న గ్రంథాన్ని ముద్రిస్తూంది.

శ్రీ కృష్ణ నాయక్ చవాణ్ గారు బంజారా ప్రజలకోసం భగవద్గీత 18 అధ్యాయాల్లోని 700 శ్లోకాలను మూలము, మూల అనువాదము, పద విభాగము, తాత్పర్యాలను బంజారా భాషలో చక్కగా సమకూర్చి అందించారు. విద్యావంతులైన బంజారీయులు తమ భాషలోకి అనువదించిన ఈ బంజారా గీతామృతాన్ని పారాయణం చేయడంద్వారానూ, తమ మాతృభాషలో గీతాసారాన్ని తెలుసుకోవడంద్వారానూ ఆ దేవదేవుని కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తూ...

సదా శ్రీవారి సేవలో

యం.జి. గోపాల్

**(యం.జి. గోపాల్, ఐ.ఏ.ఎస్.)**

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి.

# సూచన

బంజారా భాషకు లిపి లేనందువల్ల బంజారా భాషలో భగవద్గీతని తెలుగులిపిలో వ్రాయడం జరిగినది. బంజారా భాషను తెలుగు లిపిలో భాషకు తగ్గట్టుగా ఉచ్చారణ చేయాలంటే ఈ క్రింది సూచనను పాటిస్తే సరిపోతుంది.

అకారాంత అక్షరాలను అనుస్వరముతో పలకాలి. అనగా ముక్కు ద్వారా పలకాలి. ఉదా "మన ద"ను తెలుగులా పలికితే అర్థం లేని పదంగా పలకడం జరుగుతుంది. అదే "మన న ద"ను అనుస్వారంతో పలికితే బంజారా భాషలో నాకివ్వుము అనే అర్థం వస్తుంది. "ధర నవేన, సాధూవూర్భలేన" ఇందులో ధ రన న, సాధూవూర్భలే న అనునవి అకారాంత అక్షరాలు."

అలాగే కర ను అనుస్వారంతో పలికితే చేస్తాడు అనే అర్థం వస్తుంది. బంజారా భాషలో కర్, కర, కరా, కరాఁ నాలుగింటి వేరు వేరు అర్థాలున్నాయి.

అకారాంత అక్షరాలు కాక ఇతర అక్షరాలు కొన్ని అనుస్వారంతో పలికితేనే బంజారా భాష తియ్యదనాన్ని అస్వాదించగలుగుతారు. అందుకని అరసున్న చేర్చడం జరిగినది. ముఖ్యముగా ప్రథమ వాచక భాషకు పరిపూర్ణత కలిగేటట్లుగా ఈ విషయాలను దృష్టిలో వుంచుకొని ఎక్కడెక్కడ అనస్వారంతో పలకాలో అక్కడక్కడ ఆ విధంగా పలకాలని మనవి చేస్తున్నాను.

**రచక్ : ఝూంజణోత్ మూడ్ కృష్ణ నాయక్ చవాణ్**

బంజారా గీతామృత్

బంజారా భాషలో శ్రీమద్భగవద్గీత

పదచ్చేద అన్వయ టీకా

**(తెలుగులో)**

రచక్ : ఝూంజణోత్ మూడ్ కృష్ణ నాయక్ చవాణ్

# బంజారాల అపురూప గ్రంథం "బంజారా గీతామృత్"

శ్రీ మూడ్ కృష్ణ నాయక్ గారు ఉద్యోగరీత్యా విధి నిర్వహణలో మునిగి తేలుతూ ఆధ్యాత్మిక చింతన కూడా తోడు చేసుకొని ఈ గ్రంథాన్ని రచించి పూరించడము ఒక గొప్ప విశేషం. వ్రాసినవాడు శ్రీ కృష్ణ నాయక్ అయితే వ్రాయించినవాడు శ్రీకృష్ణపరమాత్ముడు.

బంజారా భాష లిపి లేకుండ శిథిలమైపోతున్న స్థితిలో బంజారా భాషలో భగవద్గీతను రచించి, పాల సముద్రమును మథించి అలనాడు అమృతాన్ని సాధించినట్లుగా శ్రీ కృష్ణా నాయక్ గారు బంజారా భాషను మథించి గీతామృతాన్ని బంజారా జాతికి జవజీవాలు పోసి ఒక నూతన ఉత్తేజాన్ని బంజారాలలో కల్పించారు. ఈ అసాధ్యమైటువంటి క్రియను సుసాధ్యం చేయటంలో శ్రీ కృష్ణపరమాత్ముడు తనకు వెన్నుదండుగా ఉండి బంజారాలకు ఈ మహాగ్రంథాన్ని ప్రసాదించటంలో అతిశయోక్తిలేదు.

ఈ తరుణంలో బంజారా భాషలో అంతర్లీనమైనటువంటి ప్రాంతీయ భాషా పదాలను వాడకుండ అనుభవజ్ఞులైనటువంటి బంజారా భాషా పండితుల ఆశీర్వాదంతో మరుగున పడినటువంటి పదాలను వెలికితీసి అందరికి అర్థమయ్యే రీతిలో కల్తీలేని బంజారా భాషలో ఒక కొత్త ఛందస్సుతో యతి ప్రాస నియమమును పాటిస్తూ తన గ్రంథాన్ని రచించారు. ఈ మహాగ్రంథాన్ని బంజారాలకు సమర్పించిన విషయం బంజారా చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడుతుంది. శ్రీకృష్ణా నాయక్ గారు చేసిన కృషికి వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. భవిష్యత్తులో మరిన్ని మహత్తర కావ్యాలను బంజారాలకు అందజేయాలని బంజారా భాషా

సంస్కృతి అభిరుచులు సజీవంగా ముందు తరాలకు అందేవిధంగా కృషి చేయాలని శ్రీకృష్ణ పరమాత్ముడి కృపాకటాక్షాలతో వారు ముందుకు నడవాలని కోరుకుంటూ శ్రీ సేవాలాల్ మహారాజ్ వీరికి అండదండగా నిలిచి ఆశీస్సులు కురిపించాలని కోరుకుంటున్నాను.

**కొర్రా జగన్నాథరావు**
ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ (రిటైర్డ్)
వర్కింగ్ ప్రెసిడెంట్,
సంత్ శ్రీ సేవాలాల్ మహరాజ్ చారిటీ ట్రస్ట్

# ప్రస్తావన

బంజారాల్లోని అనేక తెగలలోని ఒక తెగ అయిన 'గోర్ బంజారా' వ్యాపారము మరియు రవాణా నిమిత్తము సంచార జీవనము గడిపారు. అందువలన వీరికి స్థిర నివాసము లేక విద్య నభ్యసించుటకు అవకాశము లేక భాషాభివృద్ధి జరుగలేదు. బంజారా భాషను ఇతరభాషలతో పోల్చుకుంటే ఇది కేవలము 20 శాతం మాత్రమే. ప్రస్తుత కంప్యూటరు యుగంలో ఆంగ్లము మరియు ప్రాంతీయ భాషా ప్రభావము వలన 10 శాతం బంజారా భాష మరుగునపడిపోయింది. ఇది ఇలాగే సాగితే ఈ భాష పూర్తిగా మరిచిపోవడం జరుగుతుంది.

భారత దేశ సంస్కృతి సంప్రదాయాల్లో బంజారాల వస్త్రధారణ ఒక ప్రత్యేకతను కలిగివున్నది. విదేశీయుల్ని ఈ వస్త్రధారణ ఆకట్టునేలా చేస్తుందనటంలో సందేహమేమీ లేదు. అలాంటి ప్రత్యేకత కలిగిన బంజారా సంప్రదాయాలపై ఎందరో మహానుభావులు పరిశోధించి పుస్తకరూపంలో భద్రపరిచారు. మరియు కొందరు పరిశోధనలు గావిస్తున్నారు కూడా. కాని సాంప్రదాయంలో ఒక భాగమైన భాషపై అవగాహనతో దీనిని అభివృద్ధిపరచాలని తగిన ప్రయత్నాలు జరుగలేదు. ఏవో చిన్న చిన్న పుస్తకాలు, పదాల అర్థాలు, వాక్యాలు వ్రాయడము జరిగినదే కాని గ్రంథ రూపంలో వ్రాసే ప్రయత్నం ఇంతవరకు ఏ ప్రాంతంలోనూ జరుగలేదు.

1960-65 ప్రాంతంలో పద్యాలు బుర్రకథలు, నాటికలు, బంజారా ఆచార వ్యవహారాలు వ్రాసిన భూక్యా బాలాజిదాస్ గారు (కొత్తగూడెం / భద్రాచలం) బంజారా భాషలో వ్రాసారు. నాకు తెలిసినంత వరకు అంతకుమునుపు బంజారాభాషలో ఒక కొత్త ఒరవడితో పద్యాలు బుర్రకథలు ఎవరూ వ్రాయలేదు. అతని రచనలు 1970 వరకు

తెలంగాణాలో బాగా ప్రచారంలోకి వచ్చాయి. కాని అవి చిరకాలం నిలిచి పోయేట్లుగా ప్రోత్సాహము జరుగలేదు. మరియు అవి అప్పటి కాలానుగుణంగా రచించబడ్డాయి.

చిరకాలం నిలిచిపోయేట్లుగా బంజారా భాషకు పరి పూర్ణతను కలుగ చేయునటువంటి మరియు బంజారా సోదరులకు ఇతర భాషీయుల కున్నటువంటి జ్ఞానాన్ని అందజేయాలని **1986** లో భగవద్గీతను బంజారా భాషలో వ్రాయుటకు సంకల్పించాను.

భగవద్గీతానువాదము కావ్య రూపములో ఉండాలని పెక్కుసార్లు ప్రయత్నించాను. కాని అది సాధ్యపడలేదు. ఈ మహత్కార్యానికి **18** సంవత్సరముల క్రిందట సంకల్పించిన నేను **01.02.2004** న అన్నవరంలో శ్రీ సత్యనారాయణ వ్రతం చేసి కావ్య రచనకు శ్రీకారం చుట్టినాను. **13.02.2004** రోజున మొదటి **5** శ్లోకాలను అనువదించాను. ఆ పిమ్మట ఏ ఆటంకము లేక ప్రతి రోజు **4-5** శ్లోకాలను అనువదించడము జరిగినది. భగద్గీతను బంజారా భాషలో అనువదించినందువల్ల ఈ కావ్యకృతికి "బంజారాగీతామృత్"గా పేరివ్వడమైనది.

మొదటి **5** శ్లోకాలు పూర్తయిన తరువాత అక్షరాలను లెక్కించగా ప్రతి పంక్తికి **13** అక్షరాలతో రెండు పంక్తులకు **26** అక్షరాలతో శ్లోకాలు పూర్తయినవి. సంస్కృతంలో **32** అక్షరాల అనుష్టుప్ మరియు **44** అక్షరాల త్రిష్టుప్ ఛందస్సులలో భగవద్గీతా శ్లోకాలు ఉన్నవి. బంజారా భాష చాల చిన్నది. మరియు ఒకటి, రెండు లేదా మూడు అక్షరాల పదాలతోనే బంజారాభాష మాట్లాడబడుచున్నది. నాలుగక్షరాల పదాలు వేళ్ళపై లెక్కించ వచ్చు. అందుకని ఎక్కువ అక్షరాలతో శ్లోకాలు వ్రాయడము కష్టమని తలచి ఆ సత్యనారాయణ స్వామియే నాకు ఈ మార్గాన్ని చూపించి

ముందుకు నడిపిస్తున్నాడని భారమంతా ఆ స్వామిపైనే వేసి 701 శ్లోకాలను 26అక్షరాల చొప్పున బంజారా భాషలో పూర్తి చేయడము జరిగినది. అలాగే ఈ బంజారీకరణకు ఆది యతి (రెండుపంక్తులలోని మొదటి అక్షరము ఒకటే యుండునట్లు) మరియు అంత్యప్రాసలను (రెండు పంక్తులలోన చివరి ఒకే యుండునట్లు) చేర్చి ఒక ప్రత్యేకతను కల్పించడమైనది. నా ఈ సాహసాన్ని విద్యాధికులు విజ్ఞులు అభినందిస్తారని ఆశిస్తున్నాను.

బంజారా భాష చాలా పరిమితమైన భాష. ఈ భాషలో చాల పదాలులేవు. అయితే భగవద్గీతను ఇలాంటి పరిమిత భాషలో వ్రాయడానికి దైవానుగ్రహము వలనే సాహసించడము జరిగిందను కోవలసిందే. భగవద్గీతను బంజారీకరించుటకు మరుగున పడిపోయిన 10 శాతం భాషా పద జాలము దొరకడము చాలా కష్టమైనను స్వామి అనుగ్రహముతో సాధ్యమైనన్ని పాత పదాలను ప్రయోగించడము జరిగినది. అంతే కాక సంస్కృత పదాలు ఒక 10 శాతం మరియు హిందీ పదాలు 10శాతం ప్రయోగిచడము జరిగినది. భాషను అభివృద్ధి పరుచుట కొరకై 10 శాతం కొత్త పదాలను ప్రయోగించడము జరిగినది. బంజారా భాష హిందీ భాషనుండి పుట్టినది. అందుకే 50 శాతం పదాలు ఒకేలా వుంటాయి. సంస్కృత భాష అన్ని భాషలకు మూలము కనుక ఈ రెండు భాషల పదాలను తీసుకోవడము జరిగినది. అందుకే ఈ పదాలను గుర్తించడము కొరకు సంస్కృత పదాలను **(S)**గా, హిందీ పదాలను **(H)** గా, పాతపదాలను **(PP)** గా, కొత్త పదాలను **(KP)**గా, సూచించడం జరిగినది.

బంజారాలు భారతదేశపు అన్ని రాష్ట్రాలలో ఉన్నారు. అందుకని వారిపై ఆ ప్రాంతపు భావం తప్పక ఉంటుంది. అలాగే నా ఈ రచనలో కూడా

ప్రాంతీయ ప్రభావము ఉండి యుండవచ్చు. పాఠకులు ఈ విషయాన్ని విశాల హృదయంతో స్వీకరిస్తారని భావిస్తున్నాను. ప్రతి శ్లోకానికి బంజారా భాషలో గీ.గా. (గీతార్ గావో) గా సూచించడమైనది. గీతార్ అనగా గీతయొక్క గావో అనగా గేయము / శ్లోకము అని అర్థము. ఆ క్రింద క.ఛే. (కడీర్ ఛేద్) గా సూచించడమైనది. కడి అనగా పదము. ఛేద్ అనగా పదచ్ఛేదమని అర్థము.

బంజారా భాషలో వ్రాయాలన్నా, వ్రాస్తున్నారన్నా అందరికి ముందుగా గుర్తుకొచ్చేది ఈ భాషకు లిపి లేదు కదా ఎలా వ్రాస్తారని నా దృష్టిలో లిపికన్న ముఖ్యమైనది భాష. హిందీ, మరాఠీ భాషలవారు దేవనాగరి లిపిని ఉపయోగిస్తున్నారు. అటువంటప్పుడు బంజారా భాషకు కూడా దేవనాగరి లిపిని ఎందుకు ఉపయోగించకూడదు. దేవనాగరి లిపిలో అకారాంత అక్షరాల ఉచ్చారణ సగము మాత్రమే ఉండును. అదే ఉచ్చారణ బంజారా భాషలో కూడా వున్నది. అప్పుడే ఆ భాషకు సరియైన ఉచ్చారణ మరియు కమ్మదనం కలుగుతుంది. లిపులు ఎన్నైనా తయారు చేయవచ్చును. కాని కొత్త లిపిని నేర్చుకొని వ్రాయడం, చదవడం ఈ ఎలక్ట్రానిక్ యుగంలో అంత సులభము కాదు. కనుక దేవనాగరి లిపియే బంజారా భాషకు సరియైన లిపి అని నా అభిప్రాయము.

బంజారా భాష ఉచ్చారణలో ఒక ప్రత్యేకను కలిగియున్నది. 'అ' కారాంత అక్షరాలను పూర్తిగా కాక సగమే పలకాలి. ఉదా:- 'మన ద' ను తెలుగులోలా ఉచ్చరించిన అది బంజారాభాషలో లేని పదమౌతుంది. ఆ అక్షరాలను సగమే ఉచ్చరించినచో అర్థవంతమైన పదముగా (నాకివ్వుము) తెలియును. ఈ భాషలో చాలా పదాలలో అనుస్వారముతో పలికే అక్షరాలు ఉన్నవి. అందుకని వాటికి అరసున్న (ఁ) చేర్చడము జరిగినది. అనుస్వారముతో పలుకకున్నచో ఆ పదము యొక్క అర్థమే మారి పోతుంది. దీనిని దృష్టిలో పెట్టుకొని సరిగా ఉచ్చరించవలెనని మనవి

చేస్తున్నాను. అంతే కాక బంజారా భాషలో వాడుకలో లేని అక్షరాలు కొన్ని ఉన్నాయి. అవి 'ఋ, క్ష, జ్ఞ'. వాటికి బదులుగా 'రు, ఛ, గ్న' లు ఉపయోగిస్తుంటారు. అందుకని వాడుక భాషనే ఉపయోగించడం జరిగినది. ఇంకొక ప్రత్యేకత ఈ భాషలో నున్నది. పదములోని మొదటి అక్షరం సంయుక్తాక్షరముగా వాడుకలో లేదు. ఉదా॥ ప్రభాత్, శ్రాప్, ప్రకృతి.... వీటిని పర్భాతి, శరాప్, పర్కృర్తి... లుగా పలుకుతుంటారు. అందుకని వాటిని ఆవిధంగానే ఉపయోగించడము జరిగినది.

బంజారా భాషలో బహువచన ప్రయోగాలు కేవలం 2 లేదా 3 శాతం మాత్రమే వాడుకలోనున్నవి. కాని ఈ కావ్యములో భాషానుగుణంగా ఎక్కడెక్కడ పదమునకు ప్రత్యయము కూడినదో అక్కడమాత్రము 100 శాతం బహువచన ప్రయోగము జరిగినది. ప్రత్యయము లేని పదాలు సందర్భానుసారంగా ఏక బహువచనములను అన్వయించుకోక తప్పదు. కొన్ని పదాలను రూపాంతముచేసి కొత్తపదాలుగా ఉపయోగించాను. ఉదా:- రమ్... రమాడో (ఆడుట..ఆడించాడు), కూద్... కుదాడో (దూకుట... దూకించాడు) వాడుకలోనున్నవి. దీని ఆధారంగా పెదాకిదో (పుట్టించాడు లేదా జన్మనిచ్చాడు) దానిని పెదాడో (4/13)గా ఉపయోగించాను. అలాగే చరా., చరావూ, (మేపుట.. మేపువాడు), ధో.. ధోవూ (ఉతుకుట... ఉటుకువాడు) వీటి ఆధారంగా పెదా.. పెదాడూ, పోష్.. పోషూ, హరప్..హర్పు (13/16) పరక్.. పర్కు, మాన్.. మాను, భగ్.. భోగు (13/22) క్రియా నామవాచక కొత్త పదాలు ఉపయోగించడము జరిగినది. ఇంద్రియమనే పదము భాషలో సరిగా ఇమిడేట్లుగా లేకపోవడము వలన దానిని 'కళాంగ్' గా ఉపయోగించాను. కళ అనగా తెలియచేయు అంగ్ అనగా అంగము (జ్ఞానేంద్రియము). జీవ్ అంటే ఆత్మ జీవ్డా అంటే శరీరము అని అర్థము. కనుక ఆత్మను జీవ్‌గా ఉపయోగించడము జరిగినది.

'భోగ్' అనే పదము బంజారా భాషలో అగ్నిలో నైవేద్యము సమర్పించడముగా బహుళ ప్రచారములో నున్నది. ఈ పదమును భోగములుగా వాడడము ఈ భగవద్గీతలో జరిగినది. పదాల అభావమువల్ల ఇలా అనేక ప్రయోగాలు చేయవలసి వచ్చినదని పాఠకులు గుర్తించాలని, వీటిని తప్పులుగా కాక భాషాపరంగా గుర్తించాలని విన్నవించుకుంటున్నాను.

భగవద్గీత పంచమవేదముగా చెప్పబడుచున్నది. ఇందులో అన్ని వేదాల సారాన్ని వ్యాస మునీంద్రుల వారు పొదుపరిచారు. దీనిని చదివి అర్థం చేసుకోవడము అంత సులభతరం కాదు. అందుకే బంజారా సోదరులకు సాధ్యమైనంత సరళంగా, వాడుక భాషలో భగవద్గీతను అనువదింపజేశాను. ముందు శ్లోకము అర్థం చేసుకుంటేనే తరువాతి శ్లోకమర్థమవుతుంది. అందుకని నా విన్నపమేమనగా మనసు ప్రశాంతముగా ఉంచుకొని కొంత సమయమును కేటాయించి భక్తి శ్రద్ధలతో చదవడం కాని వినడం కాని చేయాలి. అప్పుడే గీతాజ్ఞానము అర్థమవడము ఆరంభిస్తుంది.

నా ఈ మొట్టమొదటి రచన అందులోను బంజారా భాషలోని ఆది కావ్యము కావడము వలన ఏవైన తప్పులు దొర్లి వుంటే సహృదయముతో వాటిని నా దృష్టికి తెచ్చినచో వానిని సవరించుటకు ప్రయత్నిస్తానని మనవి చేస్తున్నాను. కొన్ని పదాలను నానార్థాలవల్ల తప్పుగా అన్వయించుకోక సరియైన రీతిలో అన్వయించుకొని చదవాల్సిందిగా కోరుతున్నాను. యతి, ప్రాసలతో, 26 అక్షరాల ఛందస్సులో కావ్య రూపములో వ్రాయడము వల్ల పదాల స్థానాలు వెనుకా ముందుగా వుంటాయి. శ్లోకపు భావాన్ని బంజారా భాషలో ఇమిడేట్లుగా వ్రాయడము జరిగినది. కనుక విశాల హృదయముతో నా కృషిని అర్థం చేసుకోవాలని కోరుతున్నాను. బంజారా భాషలో ఇలాంటివెన్నో గ్రంథాలు రావాలని, ఈ భాషకు ఇతర భాషలతో పాటు ఒక విశిష్టమైన స్థానాన్ని కల్పించడానికి మీ అందరి సహాయ

సహకారాలు ఉండాలని కోరుకుంటున్నాను. ఒకభాష మాట్లాడే భాషగా అభివృద్ధి చెందాలంటే కొన్ని దశాబ్దాలు పడుతుంది. అలాంటప్పుడు వాడుకలోనున్న బంజారాభాష మరుగున పడిపోకుండా కాపాడాల్సిన బాధ్యత బంజారా సోదరులందరిమీద ఉన్నదని మనవి చేస్తున్నాను.

ఇక్కడ చెప్పుకోవలసినవారు ఆచార్య మసన చెన్నప్ప గారు. వీరు తమ అమూల్యమైన సమయములో కొంత సమయము నాకు కేటాయించి ఈ గ్రంథమును రోజు రెండు మూడు గంటలపాటు సమీక్షించారు. గంథ్రం పూర్తి అయ్యేదాకా ఈ సమీక్ష ఒక సంవత్సరము పాటు కొనసాగినది. బంజారా భాషలోని ప్రతి పదమును ఏవిధంగా తెలుగులో ఉపయోగించ దలిచానో అడిగి తెలుసుకొని అవి భగవద్గీతలో ఉపయోగింపబడిన పదాలకు అనుగుణంగా ఉండేట్లుగా తగిన సూచనలు ఇచ్చారు. తదనుగుణంగా తగిన మార్పులు చేర్పులు చేయుటవల్ల ఈ కావ్యానికి పరిపూర్ణత చేకూరినది. అనుకోనివిధంగా శ్రీ చెన్నప్ప గారు నాకు గురువుగా దొరకడము మరియు ఈ కావ్యమును ఆసాంతము సమీక్షించడమే కాకుండా తగిన సూచనలివ్వడము నా అదృష్టముగా భావిస్తున్నాను. అందుకు వారికి హృదయపూర్వక వందనములు చేస్తూ కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

మొదటి నుండి నా వెన్నుతట్టి ప్రోత్సహించిన డా॥ వేంకట్ నాయక్ గిరిజ్యోతి ఎడిటర్ శ్రీ భీమా నాయక్ గార్లకు నా కృజ్ఞతాభివందనములు. బంజారా భాషలో ఈ కావ్య సమీక్ష గావించిన శ్రీ రమేష్ ఆర్య, శ్రీ అమర్ సింగ్ తిలావత్ (అఖిల భారత ఆదివాసి సంఘ రాష్ట్ర ఉపాధ్యక్షులు) లకు నేనెంతో ఋణపడియున్నాను. ఆచార్య శ్రీ కసిరెడ్డిగారు (అధ్యక్షులు, తెలుగుశాఖ ఉస్మానియా విశ్వ విద్యాలయం) నా ఈ కావ్య కృతిని చదివి పీఠికలో తన భావాలను పొందుపరిచారు. అందుకు వారికి నా కృతజ్ఞతలు

తెలుపుకుంటున్నాను. నా ఈ కావ్యరచనలో మొదటినుండి ప్రతి విషయంలో తగిన సలహాలిచ్చి తోడ్పడిన ధనంజయ నాయక్ దంపతులకు నా కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటున్నాను.

నా పదమూడవయేట మా నాన్నగారు హచారా పచారా మరియు సామెతలు నేర్పించి నాకు అది గురువులయ్యారు. అదే నాకు బంజారా సంస్కృతి మరియు సాహిత్యంపై శ్రద్ధ కలగడానికి మూలకారణమైనది. నాకు జన్మనిచ్చి ఈ గీతామృతాన్ని రచించే మహావకాశమును కల్పించిన నా తల్లితండ్రులైన మూడ్ లక్ష్మి స్వర్గీయ మూడ్ ఠాకూర్‌లకు పాదాభివందనములు చేస్తున్నాను. ఈ కావ్య రచనలో పాత పదాల సేకరణలోను, కొన్ని పదాల సరియైన అర్థాలను రాబట్టడములోను నా శ్రీమతి రాధ పాత్ర ఎంతో అభినందించదగినది. ఇంకా ప్రత్యక్షంగాను పరోక్షంగాను నాకు సహకరించిన మిత్రులకు నా కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను.

**రచయిత**

**ఎం. కృష్ణనాయక్ చవాణ్**

**డా॥ మసన చెన్నప్ప**
ఎం. ఎ., ఎం, ఫిల్., పి, హేచ్, డి.
అసోసియేట్ ప్రొఫెసర్
తెలుగు శాఖ, ఉస్మానియా యూనివర్సిటి

## 'మార్గకు మార్గము' ఈ బంజారా గీతామృత్

బంజారాలకు ఒక భాష ఉన్నది కాని ప్రత్యేకమైన లిపిలేదు. లిపిలేనంత మాత్రాన సాహిత్యమే లేదని చెప్పలేము. నాలుగు దశాబ్దాలకు పూర్వం భూక్యా బాలాజీ దాస్ గారు బంజారా భాషలో కొన్ని గేయాలు రచించారు. ఇంకా వారు రచించిన బుర్రకథలు, నాటికలు ఆ రోజుల్లో ఎంతో ప్రచారాన్ని పొందాయి. కాని ఇప్పుడు మిత్రుడు మూడ్ కృష్ణ నాయక్ చవాణ్ ఏకంగా శ్రీమద్భగవద్గీతను బంజారా గీతామృత్ పేరుతో అనువదించి బంజారా భాషకే అలంకారంగా నిలిచారు. ఒక కావ్యాన్ని బంజారా ఛందస్సులో రచించిన ప్రథమకవి శ్రీ కృష్ణ చవాణే.

శ్రీ కృష్ణ చవాణ్ భగవద్గీతను బంజారీకరించడానికి సుమారు పదునెమిది సంవత్సరాలు తపనపడ్డారు. ఏమైతేనేమి వారి తపస్సు ఫలించింది. 2004లో మొదలుపెట్టి సుమారు పదునెమిది మాసాల్లో అనువాదాన్ని ముగించారు.

దేశీయ ఛందస్సులో బంజారా గీతామృత్ అవతరించడం బంజారాల అదృష్టం.

వేద మంత్రాలకు ఏడు ఛందస్సులున్నాయి. అవి గాయత్రి (24 అక్షరాలు) ఉష్ణిక్ (28) అనుష్టుప్ (32) బృహతి (36) పంక్తి (40) త్రిష్టుప్ (44) జగతి (48) అనేవి. భగవద్గీతలోని శ్లోకాలు మాత్రం అనుష్టుప్ (32)

మరియు త్రిష్టుప్ (44) ఛందస్సుల్లో ఉన్నాయి. కృష్ణ నాయక్ గారు ఈ ఛందస్సుల అక్షర సంఖ్యను బాగా పరిశీలించి ఉంటారు. కనుకనే సంగీతానుగుణంగా రచనకు పూనుకున్నారు. నిజంగా వారు సృష్టించిన ఛందస్సు నూటికి నూరు పాళ్ళు దేశీయమైంది. రెండుపాదాల్లో 13 అక్షరాల చొప్పున ఉండి ఆది యతి అంత్యప్రాసలతో అలరారే ఈ ఛందస్సు బంజారా సాహిత్యంలోనే తొలి ఛందస్సు. దీన్ని ద్విపదగా భావించినా దాని గౌరవేమేమి తగ్గదు. ద్విపద తెలుగు భాషలో కూడా ఉంది. దేశీయ ఛందో రూపంగా దానికున్న గౌరవాన్ని ఎవరూ కాదనలేరు. కనుకనే రెండుపాదాల ఛందస్సును ఎన్నుకోవడంలో కూడా కృష్ణ గారు ఏంతో ప్రతిభను చూపెట్టారని చెప్పవచ్చు

'మార్గకు మార్గము' దేశీయ అనే సూక్తిని సార్థకం చేశారాయన. అందుకే ఆయన సృష్టించిన ఈ కొత్త ఛందస్సుకు మూడ్ అని ఆయన ఇంటి పేరుతోనే నేను నామకరణం చేస్తున్నాను. ఇక ముందెవ్వరైనా యతి ప్రాసలతో కూడిన అక్షరనియతమైన ఈ ఛందస్సు మూడ్ ఛందస్సు అనే పేరుతో పిలవవచ్చు.

భాష చిన్నది. సాహిత్యమూ చిన్నదే. ఐనా పరిమితమైన భాషలో అపరితమైన శక్తిని ధారవోసి శ్రుతిపేయమైన బంజారా గీతామృత్ ను కృష్ణా నాయక్ గారు రచించడం ఇంతకాలానికైనా ఆ భాష చేసుకున్న అదృష్టమే.

అనువాదకులు ఈ కృతిని సంతరించడంలో ఎంత కష్టపడ్డారో నేను స్వయంగా చూశాను. కొన్ని సార్లు యతిప్రాసలు అలవోకగా వాటంతట అవే వస్తాయి. కొన్ని సార్లు ఎంతో ఇబ్బంది పెడతాయి. మూలంలోని ఒక్కొక్క శ్లోకానికి ఒక్కొక్క పద్యాన్ని ఎన్నుకోవడం అసిధారావ్రతమే.

ఐతే కవి ఈ వ్రతాన్ని పాటించడంలో కృతకృత్యులయ్యారు. భగవద్గీత వేదాంత గ్రంథం. గీతలోని పరిభాషకు సమానార్థకాలు బంజారా భాషలో చాలా తక్కువ. అసలు లేనే లేవనాలి. శ్రీ కృష్ణ నాయక్ ఈ విషయంలో ఎన్నో కొత్త పదాలను సృష్టించి తమ నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

తెలుగులో ఆదికవి నన్నయ్య సంస్కృత శబ్దాలను తత్సమీకరణచేసి భారతాన్ని సుసంపన్నం చేశాడు. ఆతర్వాత కవి బ్రహ్మ తిక్కన్న భారత రచనలో ఎక్కువగా దేశ్యాలనే వాడాడు. శ్రీ కృష్ణ చవాణ్ తిక్కన్న మార్గాన్ని అనుసరించాడంటే అతిశయోక్తికాదు. అందుకే ఈ గీతామృతాన్ని చదివినప్పుడు ఆయనను బంజారా తిక్కన అని పిలవాలనిపిస్తుంది.

ఇతర విషయాలకేకాక ఆధ్యాత్మిక విషయాలకు సరిపడే శబ్దరాశి కొరవడిన బంజారాభాషలో సంస్కృత శబ్దాలను యథేచ్ఛగా వాడుకోవడానికి అవవాశం ఉన్నప్పటికీ శ్రీ కృష్ణ చవాణ్ దాన్ని త్రోసిరాజని స్వీయభాషలోని శబ్దజాలాన్నే గ్రహించి సంస్కరించి ఒక్కొక్కసారి కొత్తపదాలను సృష్టించి రచనకు నిండుదనాన్ని సమకూర్చారు.

మూలంలోని భావం అనువాదంలో రావడానికి కృష్ణ నాయక్ ఎంతో తపస్సు చేశారు. శబ్దోపాసకుడయ్యారు. నాలుగైదు ప్రత్యయాలున్న తన భాషను ఆత్మ ప్రత్యంతో సముచితమైన శబ్దపల్లవాలను సృష్టించి బంజారా భాషకే సొగసును ఆపాదించారు.

అక్షరాలు అనుకున్న సంఖ్యను దాటితే ఛందస్సు ఒప్పుకోదు. అందుకేవారు ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నారు. కర్మేవుమా అంటే కర్మలలో అని అర్థం. ఒక అక్షరం తగ్గటానికి స్వరలోపం చేశారు కర్మేవ్మా అని. ఐనా అర్థానికి బాధకలుగలేదు. మనం తెలుగులో కూడా కానుక ను కాన్క అంటాం కదా. ఈ కృతిలో ఒకే అచ్చుగల శబ్దాలతోపాటు రెండచ్చులు మాత్రమే ఉన్న శబ్దాలతో కొన్ని పద్యాలు రచింపబడ్డాయి.

ఉదాహరణకు ఈ క్రింది పద్యాన్ని గ్రహించవచ్చు.

**వాతే కర్తో లే దే ఖా సో చాల్తో సామళ్తో**
**వాఁస్లేతో సాఁస్లేతో ఛీప్తో ఆంకీ కాడ్మీచ్తో** **5/8**

పదవిభాగం చేసినప్పుడు వాతే, కర్తో, లే, దే, ఖా, సో, చాల్తో, సామళ్తో, వాఁస్, లేతో, సాఁస్, లేతో, ఛీప్తో, ఆంకీ, కాడ్, మీచ్తో అని **16** పదాలు ఏర్పడ్డాయి. ఇలాంటి పద్యాలెన్నో ఈ గ్రంథంలో ఉన్నాయి. ఏకాక్షరాలు శబ్దాలుగా పరిగణించడం సంస్కృతంలోలాగ బంజారా భాషలోనూ సంప్రదాయమని చెప్పవచ్చు. ఒకే ఛందస్సులో ఏడువందల ఒక శ్లోకాలను అనువదించడం, యతి ప్రాసలను పాటిస్తూ మరియు మూలభావోల్లంఘునం కాకుండా రచించడం ఈ గ్రంథవిశేషం.

కృష్ణ నాయక్ గారు భగవద్గీతను బంజారా భాషలోకి అనువదిస్తునప్పుడు, ఆ తర్వాత ఎంతోమంది పండితులను సంప్రదించారు. వారి కృషిని అభినందించిన వారే తప్ప కాదన్నవారు లేరు. ఐతే తమ అనువాదం మూలానికి దగ్గరగా ఉందా? లేదా? అన్న సందేహం వారిలో కలిగింది. ఆ సందేహాన్ని నివృత్తి చేసుకోవడానికి వారు నా దగ్గరికి వచ్చారు. నాకు ఆధ్యాత్మిక విషయాలంటే ఎంతో ప్రేమ. కాదనలేకపోయాను. కృష్ణ నాయక్ గారు సుమారు సంవత్సరానికి పైగానే నా దగ్గరికి రావడం జరిగింది. వారు తమ అనువాదాన్ని చదివి. తెలుగులో అర్థాన్ని నాకు చెప్పినప్పుడు అది మూలార్థంతో సరిపోతుందో లేదో చూడాలి. నేను మూలార్థం సరిగా ఉండేట్లుగా అక్కడక్కడ కొన్ని మార్పులు చేర్పులను సూచించాను. ఆ విధంగా గీతామృతాన్ని అంతా పరిశీలించడం జరిగింది. అందుకు ఎంతో సమయాన్ని వెచ్చించినందుకు నాకు కూడా మహానందంగా ఉంది.

బృహదారణ్యకోపనిషత్తును బృహద్గీత అనే పేరుతో ముత్యాల సరాలలో అనువదించిన అనుభవమూ, చిన్నప్పటి నుంచి గీతను అధ్యయనం చేసిన అనుభవమూ కృష్ణ నాయక్ గారి గీతానువాదానికి ఎంతో తోడ్పడ్డాయి. భారతాంధ్రీకరణంలో నన్నయ్యకు నారాయణభట్టు తోడ్పడ్డాడు. ఈ కవికి సాయ పడడంలో నేను నారాయణ భట్టంతటి వాడిని కాదు కాని ఒక మహత్తరమైన కార్యానికి ఇతరుల సహాయం లభించడం భగవన్నిర్దేశమని నా అభిప్రాయం.

కృష్ణ నాయక్ గారు ఈ కృతిలోని నూటయాభై పద్యాలను ఒక క్యాసెట్ రూపంలో పాడించారు. నేను ఆ క్యాసెట్‌ను విని పరవశించి ఆనంద సాగరంలో ఓలలాడాను. మరి ఈ రచనతో అతని జీవితం ధన్యమైందని అనుకుంటున్నాను. అంతేకాదు బంజారా భాష ధన్యమైందని విశ్వసిస్తున్నాను. కృష్ణ నాయక్‌ను నాకు పరిచయం చేసిన ధనంజయ్ నాయక్ గారు కూడా ధన్యులని భావిస్తూ బంజారా సాహిత్య చరిత్రలో అపూర్వమైన గీతామృతాన్ని ముముక్షువులకు ఆమోదయోగ్యమైన రీతిలో రచించి తన జాతి యావత్తూ గ్రోలటానికి అవకాశం కల్పించిన శ్రీ మూడ్ కృష్ణ నాయక్ చవాణ్ గారికి జీవితంలో అన్ని శుభాలు కలగాలని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను.

డా॥ మసన చెన్నప్ప

**Amar Singh, Tilawat**
Former Minister, Govt.of.A.P.
National Vice President.
All India Banjara Seva Sangh. A.P. &
State President Akhil Bharatiya
Adivasi Vikas Parishad. A.P

## బంజారాల ఆది కావ్యానికి స్వాగతం

బంజారా భాషలో భగవద్గీత వ్రాస్తున్నానని శ్రీ కృష్ణా నాయక్ చవాణ్ తెలిపినప్పుడు ఇది సాధారణంగా అందరు వ్రాసినట్లు వ్రాస్తుండవచ్చునని అనుకున్నాను. ఒక రోజు తను వ్రాసినది (అప్పటికి నాలుగు అధ్యాయాలు మాత్రమే వ్రాయడము జరిగినది) నాకు చదివి వినిపించినప్పుడు నేనెంతో పులకించిపోయాను. స్వతాహాగా నేను గీతాపారాయణము చేస్తుంటాను. ఆ అనుభవంతో తను వ్రాసినది ఎంతవరకు సబబుగా నున్నదో అంచనా వేసాను. చాలా అద్భుతంగా గీతా శ్లోకాలను అనువదించారు. పదాలే సరిగా లేని బంజారా భాషలో ఒక ఛందస్సును ఆధారంగా చేసుకొని వ్రాయడమనేది నిజంగా ఎంతో గొప్ప విషయము. బంజారా భాషలో కవితలు, పాటలు, గేయాలు చాలామంది వ్రాసారు. కాని ఛందోబద్ధంగా ఇంతవరకు ఎవరూ వ్రాయలేదు. సాధారణంగా బంజారాలు బంజారా భాషను మాట్లాడినా వ్రాసినా ఆ ప్రాంతపు భాషా పదాలు వాడకుండా ఉండలేరు. ఎందుకంటే బంజారా భాషలో చాలా పదాలు లేవు. మరియు చాలా పదాలను మరచిపోవడం జరుగుచున్నది. కాని కృష్ణ చవాణ్ మాత్రము తెలుగు పదాల ప్రభావానికి లోనుకాకుండానే సాధ్యమైనంతవరకు మరుగున పడ్డ పదాలను వెలికి తీసి బంజారా గీతామృత్‌లో పొదుపరిచినారు. అంతేకాకుండా కొత్తపదాల ప్రయోగములు చేసి బంజారాలకు పద

సంపదను కూడా అందచేసారు. అందుకని వారిని నేను చివరివరకు ప్రోత్సాహమిస్తూ వచ్చాను.

అక్కడక్కడ సంస్కృత పదాలను సందర్భోచితంగా ఉపయోగించి బంజారా భాషకు మెరుగులు దిద్దారు. బంజారా భాషకు ఒక నిర్దిష్ట రూపాన్నివ్వడానికి వారు పడిన శ్రమ ఎంతో శ్లాఘనీయమైనది. భాషనే కాక భగవద్గీతలోని జ్ఞానాన్ని బంజారా సోదరులకు తమ భాషలో అతి సరళంగా సులభంగా అర్థమయ్యేట్లుగా వ్రాయడము భగవంతుడి అనుగ్రహమే. 26 అక్షరాల ఛందస్సు కావడమువల్ల సంధులు సమాసాలు ఏర్పడి చదవరులకు అది కొత్త పదములాగాను చదవడానికి కష్టంగానూ అనిపించడము సహజము. దానిని సరళీకరించడానికి క్రింద పదచ్ఛేదము (కడీర్ ఛేద్ క.ఛే.) చదవడానికి అనువుగా మార్చడము కూడా అభినందించదగిన విషయమే. సంస్కృతములో రెండు ఛందస్సులతో వున్న భగద్గీత శ్లోకాలను ఒకే ఛందస్సుతోనూ, రెండు పంక్తుల మొదటి అక్షరము యతిగా మరియు అంత్యప్రాసలతో వ్రాయడము కేవలము కృష్ణ నాయక్ చవాణ్ కే సాధ్యపడినది. భగవదనుగ్రహము లేనిదే ఇది సాధ్యపడదనేది నా అభిప్రాయము. బంజారాలు భారత దేశమంతట ఉన్నను ఇలాంటి ఛందోబద్ధమైన కావ్యము కాని గ్రంథముకాని బంజారా భాషలో ఇంతవరకు ఎవరూ వ్రాయలేదు. అలాంటి బంజారా గీతామృత్ బంజారాల ఆది కావ్యమవడంలో అతిశయోక్తి ఏమియును లేదు.

కృష్ణ చవాణ్ ఒక్కొక అధ్యాయము పూర్తి కాగానే చదివి వినిపిస్తూ వచ్చారు. భాషలోని తియ్యదనాన్ని, భగవద్గీతలోని జ్ఞానాన్ని నా మాతృ భాషలో అస్వాదించడము అదొక అనిర్వచనీయమైన అనుభూతిని కలుగజేసినది. అలాంటి మధుర కావ్యాన్ని రమేశ్ ఆర్యాతో సమీక్షించడము అందులో చిన్న చిన్న మార్పులను సూచించడము దానికి అనుగుణంగా

కృష్ణ చవాణ్ మార్పులు చేయడము నా ఆధ్వర్యంలో జరిగినందుకు గర్వంగాను అదృష్టంగాను భావిస్తున్నాను. బంజారా సోదరులందరు ఈ కావ్యాన్ని తప్పకుండ చదివి భగవద్గీతాజ్ఞానాన్ని తమ భాషా మాధుర్యాన్ని గ్రోలాలని విన్నవిస్తున్నాను.

బంజారా భాషా స్వరూపము హిందీ భాషను పోలి ఉంటుంది. హిందీ భాషను దేవనాగరి లిపిలో వ్రాస్తున్నారు. కనుక బంజారా భాష కూడా దేవనాగరి లిపిలో ఉంటేనే ఆ భాషకు పరిపూర్ణత చేకూరుతుంది. ఈ బంజారా గీతామృత్‌ను దేవనాగరి లిపిలో వ్రాయవలసిందిగా కోరిన వెంటనే శ్రీ కృష్ణా నాయక్ అందుకు అంగీకరించడము ఎంతో సంతోషాన్నిచ్చింది. ఈ బంజారా గీతామృత్ దేవనాగరి లిపిలో త్వరగా రావాలని ఆశిస్తున్నాను.

ఇలాంటి అద్భుతమైన కావ్యాన్ని రచించిన శ్రీ కృష్ణ నాయక్‌ను మనస్ఫూర్తిగా అభినందిస్తూ నా శుభాకాంక్షలు తెలియచేస్తున్నాను. ఆ శ్రీకృష్ణ భగవానుడి అనుగ్రహంతో ఇలాంటివెన్నో రచనలు చేసి బంజారా భాషకు పరిపూర్ణత చేకూర్చాలని మనసారా కోరుకుంటున్నాను.

**అమర్సింగ్ తిలావత్**

## బంజారాల తొలి కావ్య కర్తకు దీవెనలు

హిందూ సంస్కృతిలో పంచమవేదంగా పరిగణించే మహాభారతాన్ని వేదవ్యాసుడు సంస్కృతంలో రచించారు. ప్రపంచంలోనే అత్యుత్తమమైన ఈ కావ్యఖండం భాషా ఔనత్యాన్ని అందనంత ఎత్తుకు తీసుకవెళ్ళిందనడంలో సందేహంలేదు. భాషామృతం సేవించడానికి ఆ భాషలో ఆ భావంలో మమేకం కావాల్సివుంది. ఈ దృష్టితోనే అనేకమంది భాషా పండితులు ఈ భావరమ్యతను రుచి చూపారు. కాని ఇటువంటి ప్రక్రియ లిపిరహిత భాషలో జరుగలేదు. ప్రప్రథమంగా ఒక లిపి లేని భాషలో ఇటువంటి ప్రయత్నం బంజారా భాషలో జరగడం, అందునా ఈ ప్రయత్నం మా మిత్రుడు శ్రీ కృష్ణా నాయక్ చేయడం ఒక అనిర్వచనీయ అనుభూతిని కలుగచేస్తున్నది.

తొలిసారిగా కృష్ణా నాయక్ పద్యరూపంలో భగవద్గీతను బంజారా భాషలో తెలుగులిపినుపయోగించి అనువదిస్తున్నానని చెప్పినప్పుడు ఆయనకు బంజారా భాషలో పట్టున్న సంగతి నాకు బాగా తెలిసి ఉండడంచేత రచనలో చమక్కువున్నా లేకపోయినా భాషారూపం నిక్షిప్తమవుతుందని సంతోషించాను. ఆనందించాను. అయితే గ్రంథంలోని పద్యభాగాన్ని చదివి వినిపించిన తర్వాత ఖచ్చితంగా బంజారా తొలికావ్యంగా నిలుస్తుందని శ్రీ కృష్ణా నాయక్ స్థానం బంజారాభాష చరిత్రలో సుస్థిరం చేస్తుందని అనిపించింది. శ్రీకృష్ణ భగవానుడే కృష్ణా నాయక్ చేత ఈ గీత పలికించివుంటారని నా విశ్వాసం.

భాషా వాఙ్మయంలో పదాలు పదబంధాలు వ్యాకరణ సౌష్ఠవం భాషకు పూర్తి రూపాన్ని ఇస్తాయన్నది భాషా నిపుణులు నిరూపించినదే. వ్యాకరణం చేర్చి లిపిలేని భాషలో భాషకు రూపాన్నిచ్చి శైలిని ఎన్నుకొని భాషలో వాడుకలో లేని పదాలను పద బంధాలను వెదికితీసి ఒక గొప్ప కావ్యరాజానికి

అనువాదరూపంలో నిబిడీకృతం చేయడమనేది కత్తిమీదసామే. భాషావేత్తలు కూడా ఇటువంటి ప్రక్రియకు పూనుకోవడానికి సాహసం చేయాలంటే ఒకటికి పదిసార్లు ఆలోచించే విషయమే. దీనికి భాషలో పట్టుతోబాటు భగవదనుగ్రహం ఉండాలి. ఖచ్చితంగా ఈ రెంటి మేళవింపు పొంది పూర్వజన్మ సుకృతంతో శ్రీ కృష్ణా నాయక్ అత్యద్భుతంగా బంజారా భాషలో పద్యరూపంలో యతి, ప్రాస, ఛందస్సులతో చక్కని పదాల ఒరవడితో మాతృకను మైమరిపించే విధంగా భగవద్గీతను బంజారీకరించారు. బంజారా భాషలో ఇన్ని సొబగులున్నాయా! మధురామృతాన్ని గ్రోలడం మినహా, ఆ రమ్యతను పదాలలో చెప్పడమనేది చెరుకుగడను చూపి దీని రుచి చాలా తియ్యగా ఉంటుందనడం లాంటిదే. ఒక బంజారా మిత్రునిగా మనఃపూర్వకంగా ఆస్వాదిస్తూ కృతికర్తని అభినందిస్తున్నాను. మరియు దీవిస్తున్నాను.

బంజారా భాషకు ఇంతటి ఉత్తమసేవ చేసిన శ్రీ కృష్ణ నాయక్‌కు బంజారాలందరు ఋణపడివుంటారు. వారు మరిన్ని రచనలు చేయాలని ఈ ఉత్తమాభిరుచిని రాబోయే తరాలకు అందించాలని తద్వారా బంజారా భాషావాఙ్మయం అభివృద్ధి చెందాలని మనసారా కోరుకుంటున్నాను.

గీతామృతాన్ని గ్రోలి శ్రీ కృష్ణభగవానుని కృపకు పాత్రులగుదురుగాక!

**మున్నావత్ భీమా నాయక్**
సంపాదకులు
గిరిజ్యోతి పక్ష పత్రిక
1224/5/133, నరసింహా కాలని
సైదాబాద్, హైద్రాబాద్.

## వనమాలి సేవలో వనచర్ గీత

దేశంలో లిపిసహిత భాషలకన్న లిపిరహిత భాషలే ఎక్కువ. అటువంటి వాటిలో బంజారా ఒకటి. ఆ మధ్య హిందీ, మరాఠి లిపి కలగలిపి ఓ ప్రయత్నం చేశారు. దానికి బంజారా లిపి అని పేరు పెట్టారు. అయితే అన్నిప్రాంతాల బంజారాలకు ఎప్పటికి అందుతుందో చెప్పలేము. ముఖ్యంగా తెలుగునాట ఉన్న బంజారాలకు ఆ లిపి ఇప్పుడప్పుడే పట్టుపడే నమ్మకం లేదు. తెలుగునాట ఉన్న బంజారాలకు తెలుగు లిపి తెలుసు. మాట్లాడం, చదవడం, వ్రాయడంలో వారికి నైపుణ్యం ఉంది. అందువల్ల బంజారా మౌఖిక భాషను తెలుగు లిపిలో వ్రాయడం,, ఇటు తెలుగువారికి అటు తెలుగు మాట్లాడే బంజారాలకు ఓ ఏకతా భావాన్ని నిర్మాణం చేస్తున్నది. పైగా పేర్లలో, ఆచారాల్లో, వ్యవసాయంలో, గృహజీవనంలో, ఉత్సవాలలో, దేవుని కొలువుల్లో, ఓ ఏకతా సూత్రం ఉంది. నివాస స్థానాలు (తాండాలు) ఒకప్పుడు గ్రామాలకు, నగరాలకు దూరంగా ఉన్నట్లనిపించేవి. జనాభా పెరగడం, రోడ్డు సౌకర్యం కలగడం, పల్లెలు విస్తరించడం, దూరభారాలు తగ్గడం, వస్త్రధారణలో తేడా కూడా తొలిగిపోవడం, తెలుగువారికి బంజారాలకు భాషలోనూ, భావాల్లోనూ ఏకత ఏర్పడుతుండడం అందరం గుర్తిస్తూనే ఉన్నాము.

ఇటువంటి ఆదానప్రదానాలు జరుగుతున్న సందర్భంలో తెలుగు లిపిలో బంజారా భగవద్గీత (బంజారా గీతామృత్) వస్తున్నది. సంస్కృత భగవద్గీత ద్వారా శ్రీ కృష్ణభగవానుడు అర్జునునిలోని విషాదాన్ని దూరంచేసి, కర్తవ్యం వైపుగా నడిపించాడు. అకర్మణ్యత నుండి కర్మణ్యత దిశగా ఆ నాటి ఈనాటి నరుణ్ణి నారాయణుడు నడిపిస్తూనే ఉన్నాడు. అది ప్రపంచంలోని అన్ని భాషల్లోకి వచ్చింది.

ఇప్పుడు తెలుగులిపిలో బంజారా భాషలోకి భగవద్గీత వస్తున్నది. అలనాడు చెప్పింది శ్రీకృష్ణ భగవానుడు. బంజారాలోకి అనువాదం చేసింది.

శ్రీ కృష్ణ నాయక్ చవాణ్, ఇదేదో యాదృచ్ఛికంగా జరిగిందను కోవడం లేదు. ఇది భగవన్నిర్ణయమే. తనపేరు కలిగన వారిచేత ఆ భగవంతుడే అనువదింపచేసారనిపిస్తుంది.

ఒక లిపిరహిత భాషను మరొక లిపిలోకి తీసుకొని రావడం బహు ప్రయాసతో కూడుకున్న విషయం. బంజారాలో ధర్మ కర్మ పదాలకెన్నింటికో సమానార్ధకాలు లేకపోవచ్చు. అప్పుడు భావార్థక పదాలను నిర్మించుకోక తప్పదు లేదా వాటినే వాడుకోకతప్పదు.

నిశ్చయాత్మక బుద్ధి అవే (2/41) పదానికి అచల్బుణ్ అనీ, ఆత్మన్యేవాత్మా (2/55) అనే పదానికి జీవేతీవ్ జీవేమా (ఆత్మతో ఆత్మయందు) ఇలా ఎన్నో నిర్మాణం చేసుకొన్నారు. కొద్ది పాటి సంస్కృతం బాగా హిందీ తెలిసినవారికి ఈ బంజారా గీత వెంటవెంటనే అర్ధమవుతుంది. బంజారాలో తెలుగులో హిందీలో యోగేమా యోగములో యోగ్ మే దేక సేన అన్నింటిని దర్శిస్తాడు సబ్ కో దేఖేగా గ్యానీ వూ జ్ఞాని అతడు వహ జ్ఞాని మౌ వతాయో తెలిపాడు బతాయా కర్‌తార్ కరం నీ కర్మలు నీవు చేయుము తుమ్హారాకరం తుమ్ కరో లడ్యే వేరేన ఈ యుద్ధాన్ని చేయుము యహ యుద్ధ కరో.

ఈ విధంగా ఎన్నో హిందీ హిందుస్తానీ పదాలు బంజారా భాషానుగుణంగా విభక్తులతో అర్థయుక్తంగా మారి ఈ గీతానువాదంలో చోటు చేసుకున్నాయి. ఈ బంజారా గీతలో ఇంకా ఎన్నో సంస్కృత పదాలు కొద్ది మార్పులు కనిపిస్తున్నాయి.

స్వర్గమ్ = సరగ్; దోషమ్ = దోషేమా; ధాత్రి = ధర్తి; ధీరమ్ = ధీరజేన్; త్రైగుణ్య = తీన్గుణ్ కొన్ని వందల పదాలకున్న సామ్యాన్ని పరిశీలించవచ్చు. లిఖిత, అలిఖిత, భారతీయ భాషలన్నింటికి తల్లిగా

సంస్కృతం కనిపిస్తుంది. 'జనని సమస్త భాషలకు సంస్కృత భాష ధరాతలంబునన్' అనేమాట సత్యమనిపిస్తుంది.

శ్రీ రఘాంజణోత్ మూడ్ కృష్ణా నాయక్ చవాణ్ గారి ఈ భగవద్గీతానువాదం భక్తుల్లో ఆధ్యాత్మిక వికాసానికి దోహదం చేస్తుంది. భారతీయుల్లో సాంస్కృతిక ఏకతకు దారులు తీస్తుంది. భాషా శాస్త్రవేత్తలకు తులనాత్మక భాషా పరిశీలనకు దోహదం చేస్తుంది. ముఖ్యంగా సంస్కృతం, బంజారా, హిందీ, రాజస్తానీ, మరాఠీ, గుజరాతీ తెలుగు తదితర భాషలపై ఆధ్యాత్మిక చైతన్యం కలిగిస్తుంది. కర్మ జ్ఞాన, భక్తి, ధ్యాన యోగాల వైపుగా వారిని పయనింపచేస్తుంది. బంజారాల బాల బాలికలకు ఇదొక పారాయణ గ్రంథంగా నిలిచిపోతుంది. తద్వారా వారిలో వాక్శుద్ధి, భావ సంపద తార్కికం పెరిగే అవకాశం కలుగుతుంది. అంతేకాక ప్రకృతి, మాయ, ఆత్మ, పరమాత్మ, జీవుడు, ఆధిభౌతికము, అద్వైతము, ఆధ్యాత్మికము అనే అంశాలు స్పష్టంగా అర్థమవుతాయి. విశాల జనజీవన ప్రవంతిలో ఒక ఏకతా సూత్రం నిర్మాణమవుతుంది. భగవద్గీత అందరికి ఎందుకు పవిత్ర గ్రంథమయిందో అధ్యయనం చేసే అవకాశం కలుగుతుంది.

ఇన్ని బృహత్ప్రయోజనాలు సాధించి పెట్టే ఈ బంజారా గీతకు స్వాగతం పలుకుదాం. చివరకు ఒక శ్లోకాన్ని పరిశీలిద్దాం.

**సంస్కృత శ్లోకం**

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మ ఫలహేతుర్భూః మాతే సంగోస్త్వకర్మణి 2/47

**బంజారా గీతా గావో**

హక్తోన్ఛ కరమేరోన్ఛని వోర్ఫళేరో
హనుకేన్ఛోడ్మత్ తుఁ ధర్మేర్కరం కరేరో

తెలుగు గేయం

కర్మచేయగ హక్కున్నది
కర్మఫలితము కోరలేదోయి
కర్మఫలమునకు కాకు హేతువు
కర్మ మానక ఉందుగాక

కర్మ అనేపదం మూడు భాషల్లో సమానమే. ఫలం అనే పదం కూడా మూడింటిలో ఉంది. క్రియాపదాల్లో మార్పు కనిపిస్తుంది. సంస్కృతంలో మా భూః (కావొద్దు ) అని వుండగా బంజారా భాషలో ఛేని (లేదు) అని ఉంది. తెలుగులో కోరలేదు అని ఉంది. సంస్కృతంలో మా అస్తు (ఉండకుండు గాక) అని ఉండగా, బంజారా జభాషలో ఛోడ్మత్ (మానేయకు) అని ఉంది, అదే తెలుగులో మానక ఉందుగాక అని ఉంది. నామ విభక్తులు, క్రియా విభక్తుల్లో తేడా కనిపిస్తుంది కాని, భాష అంతా ఒకటే అని నిరూపించగలుగుతాం.

ఇలా అనేక ఆలోచనలకు పుట్టినిల్లయింది బంజారా గీత. అధ్యయన శీలురులకు ఆధ్యాత్మిక జిజ్ఞాసులకు, ఆర్తులకు, అర్థార్థులకు, జ్ఞానులకు పరమ గమ్యంగా కనిపించే గీతనందించిన శ్రీ కృష్ణ నాయక్ గారు ధన్యులు. దేశీ భాషలు ఈ విధంగా మరింత సుసంపన్నం చేయడంలో వారి యోగదానం నిరంతరం కొనసాగుతుందని భావిస్తూ, వారిని సర్వదా ఆ వన్‌చర దేవీ ప్రేరణతో ఆ కృష్ణ పరమాత్మ ఆదుకోవాలని ప్రార్థిస్తూ సెలవు.

**సదా దైవ సేవలో**

**ఆచార్య కసిరెడ్డి**
భాగ్యనగర్
పూర్వాధ్యక్షులు, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వ విద్యాలయం, హైదరాబాదు.

# బంజారా గీతామృత్

ఓం శ్రీ గణేశాయ నమః

ఓం శ్రీ సత్యనారాయణ స్వామినే నమః; ఓం శ్రీ పరమాత్మనే నమః

## భగవద్గీతార్ వింతిన్ అర్దాస్ (ప్రార్థన)

*ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం*
*వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతం*

*అద్వైతామృతామృతవర్షిణీం భగవతీం అష్టాదశాధ్యాయినీమ్*
*అంబ త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీ*

**వతాయో దేవ్కిషన్ గీతార్గ్యాన్ అర్జునేన**
**వ్యాస్మని లకో శ్లోకేవుమా వో గ్యానేన**

గీతా జ్ఞానాన్ని దేవదేవుడైన శ్రీకృష్ణుడు అర్జునునికి తెలిపెను. ఆ జ్ఞానాన్ని వ్యాస మునీంద్రుడు శ్లోకములలో వ్రాసెను.

**గ్యాన్వా ఛ అమృతేర్జు అఠారధ్యాయేవ్మా**
**గీతా రూపేర్ ఛీ తూ భవాని వో గ్యానేమా**

ఆ గీతా జ్ఞానము పదునెనిమిది అధ్యాయములలో అమృతము వలెనున్నది. గీతా రూప (భవాని) దేవతగా ఆ జ్ఞానములో నీవు ఉన్నావు తల్లీ.

**హం ధావాచా మాతా కళాద వో గ్యానేన**
**హమార్మనేష్టవా యాడి తూవోన్వాయేన**

ఆ జ్ఞానాన్ని అర్థం చేసుకొనుటకు మరియు ఆ జ్ఞానాన్ని పొందుటకు మా మనసులను స్థిరపరుచునని మేము నిన్ను వేడుకుంటున్నిము తల్లి.

**వాచాఁ సామళ్సన్ సమ్మామాతి వో గ్యానేన**
**వూ గుణ్ద మాతా హమేన్ సేర్భలోకరేస**

ఆ జ్ఞానాన్ని చదివినను విన్నను వినిపించినను అందరికి మేలు చేసే గుణమును ప్రసాదించు తల్లీ.

**తార్యే గ్యానేన గావేమా బోలన్ ధోక్రేచాఁ**
**తూఁ సాయివకేన్ హర్వేళా నమణ్ కర్రేచాఁ**

ఈ గీతా శాస్త్రపు గావోలను (బంజారా శ్లోకాలను) పాడతూ మ్రొక్కుచున్నాము తల్లీ. నీవు మమ్ములను అనుగ్రహించుమని నిత్యము పాదాభివందనములు చేయుచున్నాము.

* * *

# గావో గీతార్ సత్ అన్ భేద్

**గీతార్ శ్లోక్ఛ బత్తీసన్ చౌవాల్సక్షేర్సదా**
**గావో గీతార్ఛేని ఛోవ్వీసక్షేతి జాదా**

గీతార్, శ్లోక్, ఛ, బత్తీస్, అన్, చౌవాలిస్, అక్షరేర్, సదా
గావో, గీతార్, ఛేని, ఛోవ్వీస్, అక్షరేతి, జాదా.

భగవద్గీతా శ్లోకములు 32 (అనుష్టుప ఛందసు) మరియు 44 (త్రిష్టుప ఛందసు) అక్షరములవి కూడా ఉన్నవి. గీతా గావోలలో (బంజారా శ్లోకములు) 26 అక్షరములకన్న ఎక్కువ లేవు.

**దీ హారీర్గావేరో శురూరక్షరేక్వియ**
**దోయి హారీర్ ఆఖీర్ రక్షర్సదా ఏక్రియ**

దీ, హారీర్, గావేరో, శురూర్, అక్షర్, ఏక్ వియ
దోయి, హారీర్, ఆఖీర్, అక్షర్, సదా, ఏక్ రియ

రెండు పంక్తుల గావోల మొదటి అక్షరము ఒకలాంటివే ఉండును. రెండు పంక్తుల చివరి అక్షరము ఒకటే ఉండును.

**మసన చెన్నప్పార్యార్ గ్యానేర్వజాళేతి**
**మోతీర్జు‹ యో సే గావో ఝూ‹ కే పూర్వణేతి**

మసన, చెన్నప్ప, ఆర్యార్, గ్యానేర్, వజాళేతి
మోతీర్ జు‹, యే, సే గావో, ఝూ‹కే, పూర్వణేతి

మసన చెన్నప్ప ఆర్య జ్ఞాన ప్రకాశముతో ఈ గావోలన్ని పరిపూర్ణతతో ముత్యాల్లా మెరిశాయి.

**జనం లేరేచాc భగవానేన పాయేన**
**జీవ్రాస్సేన్దీనోకోని భగ్వాన్వో గ్యానేన**

జనం, లేరేచాc, భగవానేన, పాయేన
జీవ్రాస్సేన్, దీనోకోని, భగ్వాన్, వో, గ్యానేన

భగవత్ప్రాప్తి కొరకు జన్మనెత్తుచున్నాము. భగవంతుడు జంతువులకు ఆ జ్ఞానాన్ని ఇవ్వలేదు.

**గ్యానేన పావణో నరేర్జనం లిదేకేన్**
**గమామత్ యే జన్మేన ఖాయే పీయేరోకేన్**

గ్యానేన, పావణో, నరేర్, జనం, లిదేకేన్
గమామత్, యే, జన్మేన, ఖాయే, పీయేరో, కేన్

మానవ జన్మనెత్తినందుకు జ్ఞానాన్ని పొందాలి. (కాని) ఈ జన్మ తినుట, త్రాగుట, కొరకేనని వ్యర్థ పరుచుకొనకుము.

**కరం తో కరనో ఛ బనా ఆశాపూతి**
**కూణ్సోకరం కర్నోకో మాలమ్వ గీతాతి**

కరం, తో, కరనో, ఛ, బనా, ఆశాపూతి
కూణ్సో, కరం, కర్నోకో, మాలం, వ, గీతాతి

ఫలాపేక్ష లేకుండ కర్మలను చేయువలసినదే. యే కర్మలు చేయతగినవో భగవద్గీత ద్వారా తెలియును.

**ధ్యాన్కర్నో పర్మేర్ బనా రాట్మస్తి కర్నేతి**
**దేవ్మళ సేన జో ధావ అచల్గణేతి**

ధ్యాన్, కర్నో, పర్మేర్, బనా, ఠాట్, మస్తి, కనరేతి
దేవ్, మళ, సేన, జో, ధావ, అచల్,గొణేతి

దర్పము గర్వము అహంకారములను వీడి ఆ పరమాత్మను ధ్యానించాలి. ఎవరైతే (ఇలా) స్థిరమైన గుణముతో కొలుస్తారో వారికి భగవద్ప్రాప్తి కలుగును.

**కళాలేణో సత్రజన్ తమో తీన్గుణేన్న**
**కరనో యోగ్ గుణ్తత్వేర్ గ్యానేన పాయేన**

కళాలేణో, సత్, రజ్, అన్, తమో, తీన్, గుణేన్న
కర్నో, యోగ్, గుణ్, తత్వేర్, గ్యానేన, పాయేన

త్రిగుణాలైన సత్వ రజ తామసములను తెలుసుకోవాలి. ఆ గుణాల తత్వ జ్ఞానము పొందుటకు యోగాభ్యాసము చేయాలి.

**పార్సడ్ బంజారా భాయి సే అకర్మేవూతి**
**పాల వో గ్యానేన్ గోర్ బోలీర్ గీతార్గావేతి**

పార్సడ్, బంజారా, భాయి, సే, అకర్మేవూతి
పాల, వో, గ్యానేన్, గోర్, బోలీర్, గీతార్, గావేతి

ఓ బంజారా సోదరా! గోర్ భాష (బంజారా భాష) గీతా గావోలతో ఆ జ్ఞానాన్ని పొంది అన్ని అకర్మలనుండి బయటపడుము.

**కరం ధ్యాన్గ్యాన్యోగ్ ఛ గీతామా సే వేదేరి**
**కళాల వోన వూ ఛ పరం గ్యానేర్వేరి**

కరం, ధ్యాన్, గ్యాన్, యోగ్, ఛ, గీతామా, సే, వేదేరి
కళాల, వోన, వూ, ఛ, పరం, గ్యానేర్, వేరి

అన్ని వేదాల సారమైన కర్మధ్యాన జ్ఞాన యోగములు భగవద్గీతయందు ఉన్నవి. దానిని (భగవద్గీత) పరమ జ్ఞానపు చెలమ అని తెలుసుకొనుము.

**భగవద్గీతాన్సమళ్ సమ్భావ జో కోయి**
**భగవాన్కిషన్వ అసేర్ హర్వేళా సాయి**

భగవద్గీతాన్, సామళ్, సమ్భావ, జో, కోయి
భగవాన్, కిషన్, వ, అసేర్, హర్వేళా, సాయి

భగవద్గీతను విన్నను నిపించినను శ్రీకృష్ణ పరమాత్ముడు అలాంటి వారిని ఎల్లప్పుడు అనుగ్రహిస్తుంటాడు.

**దేవ్కిషన్ వతాయో గీతార్గ్యానర్జునేన**
**దేక్దూర్నజ్రేతి సంజయ్ కో ధృతరాష్ట్రేన**

దేవ్, కిషన్, వతాయో, గీతార్, గ్యాన్, అర్జునేన
దేక్, దూర్, నజ్రేతి, సంజయ్, కో, ధృత, రాష్ట్రేన

శ్రీ కృష్ణుడు గీతాశాస్త్రమును అర్జుననికి ఉపదేశించెను. దివ్య దృష్టితో సంజయుడు చూసి ధృతరాష్ట్రునికి తెలిపెను.

**వ్యాస్ముని లకో వో గ్యానేన్ సంస్కృత్శ్లోకేవ్మా**
**వోర్గావో జోడో కృష్ణ చవాణ్ గోర్వాతేమా**

వ్యాస్, ముని, లకో, వో, గ్యానేన్, సంస్కృత్, శ్లోకేవ్మా
వోర్, గానో, జోడో, కృష్ణ, చవాణ్, గోర్, వాతేమా

వ్యాసుడు ఆ జ్ఞానమును శ్లోకములలో వ్రాసెను. అట్టి దానిని కృష్ణ చవాణ్ గోర్ భాషలో (బంజారా భాషలో) అనువదించెను.

* * *

# బంజారా గీతామృత్

## అధ్యాయ్ ఏక్

**ధృతరాష్ట్ర ఉవాచ**

*ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః*
*మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ*

ధృతరాష్ట్రేర్వచార్

**గీ.గా. కేలా సంజయ కాఁయిఁ కీదే వేర్లడేన్కేన్**
**కురుఛేత్రేమా మార్వాళన్ పాండవ్ గోళావేన్ 1/1**

క.ఛే. కేలా, సంజయ, కాఁయిఁ, కీదే, వేర్లడేన్, కేన్
కురు ఛేత్రేమా (KP), మార్వాళన్, పాండవ్, గోళావేన్

**సంజయ** = ఓ సంజయా!; **కురుఛేత్రేమా** =కురుక్షేత్రమునందు; **వేర్లడేన్కేన్ గోళావేన్** = యుద్ధము చేయుటకై కూడిన; **మార్వాళన్** = నా వారు మరియు; **పాండవ్** = పాండవులు; **కాఁయిఁ కీదే కేలా**= ఏమి చేసిరో చెప్పుము

ఓ సంజయా కురుక్షేత్రమునందు యుద్ధము చేయుటకై కూడిన నా వారు (కౌరవులు) మరియు పాండవులు ఏమి చేసిరో చెప్పుము.

**సంజయ ఉవాచ**

*దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా*
*ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్*

సంజయేర్వచార్

**గీ.గా. సమ్మక్ రణ్మాండే పాండ్వేవ్న దేకన్దుర్యోధన్**
**సమ్మాయో గురుదేవ్ ద్రోణాచార్య కనజాన్ 1/2**

క.ఛే. సమ్నక్, [PP]రణ్మాండే, పాండ్వేవ్న, దేకన్, దుర్యోధన్
సమ్మాయో, గురుదేవ్, ద్రోణాచార్య, కనజాన్

**సమ్నక్ రణ్మాండే** = ఎదురుగా యుద్ధాన్నిరచించిన; **పాండవేవ్న దేకన్** = ఆ పాండవులను చూచి; **దుర్యోధన్** = దుర్యోధనుడు; **గురుదేవ్ ద్రోణాచార్య**= గురుదేవులైన ద్రోణాచార్యుల; **కనజాన్** = వద్దకువెళ్ళి; **సమ్మాయో** = (ఇట్లు) వినిపించెను.

ఎదురుగా యుద్ధాన్నిరచించిన ఆ పాండవులను చూచి దర్యోధనుడు గురుదేవులైన ద్రోణాచార్యుల వద్దకువెళ్ళి (ఇట్లు) వినిపించెను.

పశ్యైతాం పాండుపుత్రాణామ్ ఆచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా

**గీ.గా. తూఁ దేగ్గురుదేవ్ పాండవేర్ భారి సేనాన**
**తార్చేలా ద్రుపద్పుత్రేతి రణ్మాండే జేన 1/3**

క.ఛే. తూఁ దేక్, గురుదేవ్, పాండవేర్, భారి, సేనాన
తార్,[H] చేలా, ద్రుపద, [S]పుత్రేతి, రణ్మాండే, జేన

**గురుదేవ్** = ఓ గురుదేవా! **తార్చేలా** = మీ శిష్యుడైన; **ద్రుపద్పుత్రేతి** = ద్రుపదపుత్రునిచే; **రణ్మాండే జేన** = మోహపరింప బడినటువంటి ; **పాండవేర్ భారి సేనాన** = పాండవుల గొప్ప సేనను; **తూఁ దేక్**= నీవు చూడుము.

ఓ గురుదేవా! మీ శిష్యుడైన ద్రుపరపుత్రునిచే మోహరింప బడినటువంటి పాండవుల గొప్ప సేనను నీవు చూడుము.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః

**గీ.గా. సే భళ్గే ఏకసాత్ శూర్మా భీమార్జునేతి**
**సాత్యకి విరాట్రాజ్ ద్రుపద మహరథి 1/4**

క.ఛే. సే, భళ్గే, ఏకసాత్, (PP)శూర్మా భీమార్జునేతి
సాత్యకి, విరాట్, రాజ్, ద్రుపద, మహారథి

**సాత్యకి** = సాత్యకి; **విరాట్ రాజ్** = విరాట రాజు; **ద్రుపద మహారథి** = మహావీరుడైన ద్రుపదుడు; **శూర్మా**= శూరులైన; **భీమార్జునేతి** = భీమార్జునులతో; **సే భళ్గే ఏకసాత్** = అందరు కలసి ఒకటైనారు. ష్ఠ ష్ఠ

*ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్*
*పురజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవ:*

**గీ.గా. బళ్కంటి కాశిరాజ్ చేకితాన్ ధృష్టకేతు**
**బడోనర్ కుంతి రాజ్ శైబ్య అన్పురజితు 1/5**

క.ఛే. (PP)బళ్కంటి, కాశీరాజ్, చేకితాన్, ధృష్టకేతు
బడోనర్, కుంతిరాజ్, శైబ్య, అన్, పురజితు

**బళ్కంటి కాశీరాజ్** = బలవంతుడైన కాశిరాజు; **చేకితాన్** = చేకితానుడు; **ధృష్టకేతు** = ధృష్ట కేతుడు; **బడోనర్ కుంతిరాజ్** = నరోత్తముడైన కుంతి రాజు; **శైబ్య**= శైబ్యుడు; **అన్ పురజితు** = మరియు పురజితుడు

బలవంతుడైన కాశిరాజు చేకితానుడు, ధృష్ట కేతుడు, నరోత్తముడైన కుంతి రాజు, శైబ్యుడు మరియు పురజితుడు.

*యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్*
*సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః*

**గీ.గా. బళ్యాసుత్తమౌజన్ పుత్రే దేవీ ద్రౌపదీర్**
**బాళ్వీర్సుభద్రార్బేటాన్ యుధామన్యే సే వీర్ 1/6**

క.ఛే. బళ్వాన్, ఉత్తమౌజన్, పుత్ర సే, దేవీ, ద్రాపదీర్
(H)బాళ్వీర్, సుభద్రార్, బేటాన్, యుధామన్, యే, సే, వీర్

**బళ్వాన్** = బలవంతుడైన; **ఉత్తమౌజన్** = ఉత్తమౌజుడును; **దేవీ ద్రౌపదీర్** = ద్రౌపది యొక్క; **పుత్ర సే** = పుత్రులందరు; **బాళ్వీర్** = బాల వీరుడైన; **సుభద్రార్ బేటాన్** = సుభద్రా తనయుడు; **యుధామన్ యే సే వీర్** = యుధామన్యుడు వీరందరు వీరులు.

బలవంతుడైన ఉత్తమౌజుడును ద్రౌపదియొక్క పుత్రులందరు బాలవీరుడైన సుభద్రాతనయుడు యుధామన్యుడు వీరందరు వీరులు.

*అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ*
*నాయాకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే*

**గీ.గా. గురుదేవ్ ఖాస్తీర్ధారీవూర్నాం ఆపణ్సామేర్**
**గోర్కరన్సామళ్ దళ్నాయకన్ వీర్శూరేవూర్ 1/7**

క.ఛే. గురుదేవ్, ఖాన్, (KP)తీర్ ధారీవూర్, నామ్, ఆపణ్, సామేర్
(PP)గోర్ కరన్, సామళ్, దళ్నాయకన్, వీర్శూరేవూర్

**గురుదేవ్** = ఓ గురుదేవా!; **ఆపణ్ సామేర్** = మన పక్షాన ఉన్న; **దళ్నాయెకన్** = సేనాధి పతుల మరియు; **వీర్శూరేవూర్** = వీరశూరుల; **ఖాస్తీర్ధారీర్నాం** = చేప్పుకోదగ్గ ధనుర్ధారుల పేర్లను; **గోర్కరన్ సామళ్** = శ్రద్ధతో వినుము

ఓ గురుదేవా! మన పక్షాన ఉన్న సేనాధి పతుల మరియు వీరశూరుల చేప్పుకోదగ్గ ధనుర్ధారుల పేర్లను శ్రద్ధతో వినుము.

*భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః*
*అశ్వత్థామ వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ*

**గీ.గా. ఆపణణ్ దాదా భీష్మాచార్యన్ భూరిశ్రవ్ కర్ణ్**
**అశ్వత్థామ రణ్‌జీతు కృపాచార్యన్వికర్ణ్ 1/8**

క.ఛే. ఆపణణ్, దాదా, భీష్మా చార్యన్, భూరిశ్రవ్, కర్ణ్
అశ్వత్థామ, రణ్‌జీతు, కృపాచార్య అన్, వికర్ణ్

**ఆపణన్** = తమరును; **దాదా భీష్మాచార్య** = తాతయైన భీష్మాచార్యులును; **అశ్వత్థామ** = అశ్వత్థామయును; **భూరి శ్రవ్ కర్ణ్** = భూరిశ్రవుడును కర్ణుడును; **రణ్‌జీతు కృపాచార్యన్** = యుద్ధ విజేతయగు కృపాచార్యులు మరియు; **వికర్ణ్** = వికర్ణుడును.

తమరును, తాతయైన భీస్మాచార్యులును, అశ్వత్థామయును, భూరి శ్రవుడును, కర్ణుడును, యుద్ధ విజేతయగు కృపాచార్యులు మరియు వికర్ణుడును.

*అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః*
*నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః*

**గీ.గా. అస్రాస్సారే శూర్మా దమ్దేన ఛ మార్వాసు**
**అస్త్రశస్త్ర భాంత్భాంతేర్ ధరే రణేవాసు 1/9**

క.ఛే. అస్ రాస్, సారే, శూర్మా, దం దేన, ఛ, మార్వాసు
(S)అస్త్రశస్త్ర (PP)భాంత్ భాంతేర్, (PP)ధరే, రణేవాసు

**అస్రాస్సాసరే శూర్మా** = (ఇంకను) అలాంటి ఎందరో శూరులు; **రణేవాసు** = యుద్ధముచేయుటకు; **భాంత్భాంతేర్** = నానా విధములైన; **అస్త్రశస్త్ర ధరే** = అస్త్ర శస్త్రాలు ధరించి; **మార్వాసు** = నా కొరకు; **దమ్దేదేన ఛ** = ప్రాణాలివ్వడానికి సిద్ధముగా వున్నారు.

(ఇంకను) అలాంటి ఎందరో శూరులు యుద్ధము చేయుటకు నానా విధములైన అస్త్రశస్త్రాలు ధరించి నా కొరకు ప్రాణాలివ్వడానికి సిద్ధముగా వున్నారు.

*అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్*
*పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్*

**గీ.గా. భీష్మ ఛత్రేమార్ సేనా కనా౹యి౹ హారేని**
**భీమ్ ఛత్రేమార్ సేనా కూ౹వతి జీత్సకేని 1/10**

క.ఛే. భీష్మ, ఛత్రేమార్, ఈ, సేనా, కనా౹యి౹, హారేని
భీమ్, ఛత్రేమార్, సేనా, కూ౹వతి, జీత్స కేని

**భీష్మ ఛత్రేమార్** = భీష్ముని రక్షణలో వున్నటువంటి; **ఈ సేనా కనా౹యి౹** = ఈ సైన్యము ఎప్పటికిని; **హారేని** = ఓడిపోదు; **భీం ఛత్రేమార్** = భీముని రక్షణలో వున్నటువంటి; **సేనా కూ౹వతి** =సైన్యము ఎలాగైనను; **జీత్సకేని**=గెలువలేదు.

భీష్ముని రక్షణలో వున్నటువంటి (మన) ఈ సైన్యము ఎప్పటికిని ఓడిపోదు. భీముని రక్షణలో వున్నటువంటి (పాండవుల) సైన్యము ఎలాగైనను గెలువలేదు.

*అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః*
*భీష్మమేవాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి*

**గీ.గా. భీష్మ దాదాన మదద్దో చంగా మనేతి**
**బనా ఖోటేతి సే ఆపణాపణ్ జాగేవ్తి 1/11**

క.ఛే. భీష్మ , దాదాన, మదత్, దో, (PP)చంగా, మనేతి
బనా, ఖోటేతి, సే, ఆపణ్, ఆపణ్, జాగేవ్తి

**చంగామనేతి** = (మీరు) మంచి మనసుతో; **బనా ఖోటేతి** = కపటము లేకుండ; **భీష్మ దాదన** = భీష్మ పితామహునికి; **ఆపణాపణ్** = మీమీ; **జాగేవ్తి** = స్థానముల నుండి; **మదద్దో** = మద్దతునివ్వండి.

(మీరు) మంచి మనసుతో కపటము లేకుండ భీష్మ పితామహునికి మీమీ స్థానముల నుండి మద్దతునివ్వండి.

*తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః*
*సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్*

**గీ.గా. జనా ధుర్యోధనేర్ మనేన్ హుష్యార్లాగజాఁ**
**జోర్జోర్తి భీష్మ శంఖ్ గర్జాయో సింకోసేర్జుఁ 1/12**

క.ఛే. జనా, ధుర్యోధనేర్, మనేన, హుష్యార్, లాగజాఁ
జోర్, జోర్తి, భీష్మ, శంఖ్, (PP)గర్జాయో, సంకోసేర్జుఁ

**జనా** = అప్పుడు; **ధుర్యోధనేర్ మనేన్** = దుర్యోధనుని మనస్సునకు; **హుష్యార్లాగజాఁ** = సంతోషము కలుగునట్లు; **భీష్మ** = భీష్ముడు; **జోర్జో ర్తి** = బిగ్గరగా; **సింకోసేర్జుఁ** = సింహమువలె; **శంఖ్ గర్జాయో** = శంఖమును గర్జింపచేసెను.

*తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః*
*సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్*

**గీ.గా. సామళ్వో శంఖేర్ గర్జేనన్సే బోలావూటే**
**శంఖ్ ఢోల్నంగారా తో జన్జీవ్రాస్సే దర్వూటే 1/13**

క.ఛే. సామళ్, వో, శంఖేర్, గర్జేనన్, సే, బోలావూటే
శంఖ్, ఢోల్నంగారా, తో, జన్, జీవ్‌రాస్, సే, దర్వూటే

**వో శంఖేర్గ ర్జేనన్**= ఆ శంఖముయొక్క గర్జనలను; **సామళ్ సే** = విని అందరు; **శంఖ్ ఢోల్నంగారా** = శంఖములను డోళ్ళను, నగారాలను; **బోలావూటే** = మ్రోగించారు; **తో జన్జీవ్యా స్సే** = అప్పుడు సమస్త జంతుజాలములు; **డర్వూటే** = భయ కంపితములైనవి

అ శంఖముయొక్క గర్జనలను విని అందరు శంఖములను డోళ్ళను, నగారాలను మ్రోగించారు. అప్పుడు సమస్త జంతుజాలములు భయ కంపితములైనవి.

*తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ*
*మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః*

**గీ.గా. దేవ్కిషననర్జున్ ధోళ్ఘోడేవూర్ రథేతి**
**దోయి గర్జాయే ఫుంకారన్ దివ్య శంఖేవ్తి 1/14**

క.ఛే. దేవ్, కిషనన్, అర్జున్, ధోళ్, ఘోడేవూర్, రథేతి
దోయి, గర్జాయే, ఫుంకారన్, (S)దివ్య, శంఖేవుతి

**ధోళ్డేవూర్** = తెల్లగుర్రముల; **రథేతి** = రథమునుండి; **దేవ్కిష నర్జున్** = దేవ దేవుడైన శ్రీకృష్ణుడు మరియు అర్జునుడు; **దివ్య** = దివ్యమైన; **శంఖేవ్తి**= శంఖములను; **ఫుంకారన్** = పూరించి; **దోయి గర్జాయే** = ఇరువురును గర్జించారు.

తెల్ల గుర్రముల రథమునుండి దేవదేవుడైన శ్రీకృష్ణుడు మరియు అర్జునుడు దివ్యమైన శంఖములను పూరించి గర్జింపచేసారు.

*పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః*
*పౌండ్రం దధ్మౌ మహాశ ఖం భీమకర్మాం వృకోదరః*

**గీ.గా. పాంచజన్యేన్ కృష్ణ అర్జున్ దేవదత్తేన**
**పౌండ్రేన భీమ్ వజాయే ఖాస్ఖాస్శంఖేవున 1/15**

కంఛే. పాంచజన్యేన్, కృష్ణ, అర్జున్, దేవత్తేన
పౌండ్రేన, భీమ్,వజాయే, (KP)ఖాస్, ఖాస్, శంఖేవున

**కృష్ణ పాంచజన్యేన్** = కృష్ణుడు పాంచజన్యము; **అర్జున్ దేవదత్తేన** = అర్జునుడు దేవదత్తమును; **భీమ్ పౌండ్రేన** = భీముడు; పౌండ్రమను; **ఖాస్ ఖాస్** = ప్రత్యేకమైన; **శంఖేవున వజాయే** = శంఖములను పూరించిరి.

కృష్ణుడు పాంచజన్యము అర్జునుడు దేవదత్తము భీముడు పౌండ్రమను ప్రత్యేకమైన వారి వారి శంఖములను పూరించిరి.

*అనంతవిజయం రాజా కుంతీ పుత్రో యుధిష్ఠిరః*
*నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ*

**గీ.గా. ఫూంక్మారో యుదిష్ఠిర్ అనంత్విజయ్ శంఖేన**
**పుశ్పకేన్ సహదేవ్ అన్ నకుల్ సుఘోషేన 1/16**

క.ఛే. ఫూంక్, మారో, యుదిష్ఠిర్, అనంత్, విజయ్, శంఖేన
పుశ్పకేన్, సహదేవ్, అన్ నకుల్, సుఘోషేన

**యుదిష్ఠిర్ అనంత్ విజయ్** = యుధిష్ఠిరుడు అనంత విజయమను; **శంఖేన**= శంఖమును; **ఫూంక్మారో** = పూరించాడు; **పుష్పకేన** = పుష్పకమును; **సహదేవ్ అన్** = సహదేవుడు మరియు; **నకుల్ సఘోషేన** = నకులుడు సుఘోషమును.

యుధిష్ఠిరుడు అనంత విజయమను శంఖమును పూరించాడు. పుష్పకమును సహదేవుడు మరియు నకులుడు సుఘోషమును పూరించారు.

*కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః*
*ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః*

**గీ.గా. వీర్తీర్ధారి కాశీ రాజన్ శూరామ్ శిఖండిన్**
**విరాట్రాజ్ ధృష్టద్యుమ్న అనజేయ్ సాత్యకిన్ 1/17**

క.ఛే. వీర్, తీర్ధారి, కాశీ రాజన్, శూరామ్, శిఖండిన్
విరాట్, రాజ్, ధృష్టద్యుమ్న, అన్, అజేయ్, సాత్యకిన్

**వీర్ తీర్ధారి** = వీరుడు ధనుర్ధారియైన; **కాశీరాజన్** = కాశి రాజు; **శూరామ్ శిఖండిన్** = శూరుడైన శిఖండియును; **విరాట్రాజ్**= విరాటరాజు; **ధృష్టద్యుమ్నన్**= ధృష్టద్యుమ్నుడును; **అన్ అజేయ్ సాత్యకిన్** = మరియు అజేయుడైన సాత్యకీయును.

వీరుడు ధనుర్ధారియైన కాశి రాజు శూరుడైన శిఖండియును విరాటరాజు ధృష్టద్యుమ్నుడును మరియు అజాయుడైన సాత్యకియును.

*ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథవీపతే*
*సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్*

**గీ.గా. హే రాజ్ ద్రుపదన్ దౌపదీసుభద్రార్లాల్సే**
**హర్దిశావ్తి శంఖేవున వజాయే వోసే 1/18**

క.ఛే. హే, రాజ్, ద్రుపదన్, ద్రౌపది, సుభద్రార్, (PP)లాల్సే
హర్, (H)దిశావుతి, శంఖేవున, వజాయే, వో, సే

**హే రాజ్ ద్రుపదన్** = ఓ రాజా! ద్రుపదుడు; **ద్రౌపదీ సుభద్రార్లాల్సే** = ద్రౌపది మరియు సుభద్రా కుమారులు; **వో సే హర్దిశాతి** = వారందరు అన్ని దిశల నుండి; **శంఖేవున వజాయే** = శంఖములను పూరించారు.

ఓ రాజా! ద్రుపదుడు ద్రౌపది మరియు సుభద్రా కుమారులు వారందరు అన్ని దిశలనుండి శంఖములను పూరించారు.

